# పట్టపగలు

ఎవడు పిండిన నెత్తురు లీ పతంగు
హృదయ పిండము నుండి వర్షించునిటులు ?
ఈ మహాధన్వి భువనాహవేచ్ఛదగిలి
యేరికై రక్తమాంసముల్ ధారవోయు ?

దారుణ మయూఖ విశిఖ ప్రసారవేగ
గతి నధిజ్య కోదండమ్ము కానరాదు,
దానివలె మండలీకృతమ్మైన తనువు !
యువకులగు సైనికుల కీతడాజ్ఞబంతి.

గగన గంధర్వి కనిన బంగారుకొండ
పగలొకటియైన తేజస్వి యగుచు బ్రదికి
సితయశోనిత్య యౌవన శ్రీవహించి
భూహృదయరాగ సౌందర్య మాహరించు.

# ధర్మము

రాగరంజిత మాశాంతరంగ మిపుడు
స్వైరిణి సుశీతల సమీర భావపథము
వెలుగు చీకటుల్ కలహించు వేళ యగుట
ఒక మహాకవి రూపమై ప్రకృతితోచె.

ఇసుకదిబ్బల నొరసి త్రుళ్లింతలాడు
పసపునీళ్ల ప్రాయంపు జవ్వనుల సెలల
గాత్ర లతికల రాగంపు గందమలది
ఒక మహాకవి రూపమై ప్రకృతితోచె.

పద్మరాగద్యుతులు చిందు భానుబింబ
వీట వెన్నెలపాలకై విక్రయించి
దిశల దాహమ్ముతీర్చి దాదియయి ప్రోచి
ఒక మహాకవి రూపమై ప్రకృతితోచె.

# ప్రకృతి యుద్ధము

పులకరించు నొడళ్ళ పుష్పాళులు రాల
పవనచంచలులీ వనస్పతులు పొంగి
మెచ్చుకొనుచున్నవి శకుంత మిథునపఠిత
రణవిజయగీతి నవసాంధ్యరాగగీతి—

*

బారులైన పుష్పంధయ ప్రకరమిచట
నిలిచి రణభేరి మ్రోగించె, నీరజాత
వనమహాదుర్గరాజ్ఞి యెవ్వతెయొకాని
తెలివిసూపె దుర్గద్వారములు బిగించి!

*

కొండ పొట్టేళ్ళు రెండు ఢీకొన్న వేమొ
పడమటి పొలాల పసులెల్ల పారిపోయె;
శాంతిమొలుకు సంధ్యాగిరిప్రాంతమందు
సగముచెరిగిన నెత్తుటి చార లేమి?

*

పట్టపగటి నిప్పులరేని ప్రభ వెలింగి
అఖిల దిక్కులు మండించినన్నినాళ్ళు
పోరు పొచ్చెములేక యీ పుత్రులెదిగి
అతని యవసానవేళ పోరాడనేల?

*

కొమ్ముకొనల బంగరు గజ్జె గ్రుచ్చికట్టి
పరుగులెత్తించి కాపరుల్ పందెములకు
ఆడుకొనువారు కాబోలు! నకట, వీని
గజ్జె తెగిపోయె నన్యోన్య కలహవేళ!

*

అడవి కుందేళ్లు నిదురించునట్టి వేళ
బోయెల యొడళ్ళ స్వేదాంబువులు స్రవింప
కూనపై జాగిలము మరుల్ గొన్న వేళ
జగడమా యీ సహజ సాధుజంతువులకు?

*

బెదరివచ్చిన మా లేగపిన్నదాని
కనుగొలంకుల గారుణ్యకణములురుల
కలహహేతు వెరుంగ నాకాంక్షవోడమె—
జాలిగుండెల కేమి యే జాతియైన?

*

ఎదుటి తరుశాఖ జీర్ణమై కదల గరిన
పరశువు ధరించు నిర్దయప్రాణి నరుడు:
పచ్చనిబయళ్ళ కతిథియై వచ్చుగాని
ఎండుకట్టెపై జాలి వర్షించు పశువు!

*

నవ్వులకునయి బందుగుల్ నాల్గుదెసల
మూఁగి 'మీ యమ్మ యెచటికో పోయె' ననిన
గొల్లుమను పాలబుగ్గల కూఁనవోలె
బెదరి యేడ్చెడి గోవత్స మిదిగొఁ చూడు.

*

సంగరారంభము పరాయి జాతికైన
కాలువలుగట్టునదియు రక్తమ్మెయైన
ఇవి నశింప గొల్లని నష్టమెంతొ యనుచు
పాలలో బుట్టి పెరిగిన పట్టి యేడ్చు.

*

తిరిగిపోయిరి పశుల కాపరులు నేఁడు
చూడి మొదవుల ముందుగా జూచుకొనుచు
ప్రొద్దువ్రాలకమునుపే, నిరుద్ధజలద
గర్జనలతోడి యీ వానగాలిజూచి.

*

వాడికొమ్ములు తిరిగి, మువ్వన్నె మెకము
జాడవెరవని నెత్తుటి వేడిగలిగి,
బలిసియున్న పోతు లరణ్యపథమునందు
స్వేచ్ఛవిహరింప గొల్లఁడు చింతపడడు.

*

పశ్చిమశుభాంగి కుంకుమబరణి తెరచి
రాగలుగు పేరటాలైన రజనికొరకు
వేచియున్నది; ఇంతలో, విధికృతమ్ము!
తొలగెనే తననొసటి సిందూర రేఖ—

*

పుండరీకతండము తపముపోవుత్రోవ
కడ్డురాలేదటన్న అహంకృతియును
కండక్రొవ్వునుబలిసి యీ కొండకొనల
వీని కన్యోన్యకలహ గంభీరత యిడె.

# ఎవరో

కొసరి సంధ్యామరుల్లతాంకురము లిటులు
కోసికొనిపోదు వేటికే, కుసుమగంధి ?
మీ నిలింప వనమ్ములం దేనిలేని
ఏసుఖస్పర్శ గలదు మా వేసవులను ?

అనల జిహ్వాల మార్తాండు డంతరింప
ఈ నిదాఘ సంధ్యాసుఖ ప్రాణపవన
సేవనమున మాజీవముల్ చేరుకొనుట
చూడజాలవటే సుధాంశు ప్రభాంగ ?

ఎవరియింటి కోడలవమ్మ యింతలోనె
పారిపోదు వాశానితంబములు గదల ?
చీకటి గుడారమున నిద్రజెందవలెనె
పవన లతికాంకురమ్ముల పాన్పుపరచి ?

# నీలాంబరి

చెప్పకుంటివి, చెల్లెలా, యెప్పుడయ్యె
నీకు పెండిలి యింతలో ? శిరవాహ
విపుల చేలాంచలమ్ములు బిగ్గబట్టి
అభినయించెద వింత లజ్జాతిశయము ?

ఇంద్రనీలంపు నిగ్గులు చిందు మేని
సోయగ మడంగె మంగళసూత్రరుచుల,
వెలుగు వెల్లువ దిక్కుల విరిసెజూడు !
ఎన్నిమణులు ఘటించి చేయించినారు ?

ఈ సుధాకర బింబమ్ము నీయమూల్య
రత్నమాంగల్య మిచ్చిన రాకుమారు
డెన్నిలోకాల ప్రభువోగదే, రవంత
మాకు నొకసారి చూపింతువా, కుమారి ?

# దారి విడు

ఓ రహస్యశైలదుర్గ సంచారిణీ! వి
హాయస రహస్య వచనరాజ్య ప్రధాని!
ప్రాణికోటి నిదుర జెందె, ప్రభుని దర్శ
నమునకై వచ్చి వేచియున్నాడ నొకడ,
ఇంకనైన దుర్గకవాటమేల తెరువవు?

నీ వినీలాంబరచ్ఛాయ లావరించి
మా నగరవీధులన్నియు మాటుమణగె,
కొండవాగుల పలుకు లొక్కండు దక్క
అడవులందును సవ్వడు లాగిపోయె
ఇంక ప్రభుదర్శనమున కాటంకమేమి?

ఈ విలాస రణాంగణమేల మొదట
తాను కల్పించె నన్నేల దీననిలిపె
ఏల పోరాడుమని హెచ్చరించె ననుచు
ప్రశ్నలేమొ వేయుదునన్న భయమువలదు,
ఊరకే చూడవచ్చితి, దారి విడవవే?

# మధుబంధము

తీయని పద్దెముల్ చదివి త్రేచిన కోయిఁలకూనకీ చిగు
ళ్ళియగనేల లోకజనయిత్రి? కుమారునిబిల్చి 'చందమా
మా' యని బుజ్జగించి నడుమన్ నవనీతపు గోరుముద్ద లే
లా యిడుతల్లి? యంత మరలఁ సుతు రొమ్మున జేర్చు టేటికో?

*

ఈ రవగాలికే పులకరించిన పువ్వుల తేనెగొంతులఁ
జారిన పాటవెల్లువకు షట్పద పంక్తులు నాట్యమాడు నా
య్యారమిదేమి వెన్నెలబయళ్ళ? చిగిర్చిన మామిడుల్ నిరా
ధారములైన పక్షులరొదల్ విని యేఁటికి జల్దరించెడుఁ?

*

చెదరిన బాటసారులకు చీకటిప్రొద్దుల విశ్రమింప నా
ప్పిదమగు తావొసంగెడు నభీప్సితమున్నవి పోలె ఈతరుల్
కదలగనీడురాని కసిగందులతోడి విహంగ కోటి కా
స్పదమయి, తాముగన్న పసి పచ్చనియాకుల రాల్చు టేటికో?

# ఉషస్సు

ఓ రజిత సుందరవిహంగులార! వేల
బారులై పరుగెత్తుచున్నారు మీరు
పవన పరికంపిత మహీజపంక్తి విడిచి
గగనతల సుస్థిరపతంగ గతి దలంచి?

ఓ రుధిరగంధగళ, ప్రాగ్దిశారమా! త్వ
దీయకరకంకణములైన తోయదములు
తమ వినీలమణిప్రభల్ తరిగిపోవ
కొనలు పదనెక్కి ప్రజ్వరిల్లినవి దేల?

ఓ హిరణ్య కేదారాంగ మోహినీ, ప్ర
దీప్త విశ్వంభరా, నీవి దేలయిపుడు
నీ సహజశాంతగుణమెల్ల నీటగలిపి
పొంగిపోయి ప్రాణులనెల్ల ముద్దుగొందువు?

ఇచట భయవిహ్వలత మానిపించుకొరకో?
ఇచట స్వాతంత్ర్యరుచి ప్రసరించుకొరకో?
ఇచట ప్రేమామృతము పంచియిచ్చుకొరకో?

# గురువు

నిఖిల జీవన రణభేరి నీగళమ్ము
ఘీంకరించెడి భువన భయంకరముగ
మృదువిషాద గీతారుత మ్మిదియటంచు
వ్రాసికొన్నాడ మూర్ఖుడనై, సముద్ర!

అంతలో నీ తరంగ విహంగమములు
గతినిరోధించు పవన పక్షములు చీల్చి
ఎగసి పడిపోయి మగుడ నదృశ్యమగుచు
జనన జీవన మరణ వేషములువైచు—

నీ పతనఘోష నియమ బంధితముగాన
పాటయగును పునః పునః ప్రకటితమయి :
పతన భాగ్యోదయమ్ముల గతులనుండి
యేను సంగీతమెరిగి నిర్మింపవలెనో ?

## మబ్బు తునుక

మల్లెపూరేకువంటి యీ మబ్బుతునుక
నడచు నాద్యంతములులేని నభమునందు
అభిలషింపదగిన వస్తు వవనిపైని
నాకువలె దీనికిని లేదుగాక నేడు—

ఐన, నిలువదు, నడచునేకైక దీక్ష
ఈ జలదఖండ మెందోగతించు నించు
కంతయేని చింతిలక కాలానువృత్తి
నేనుమాత్రము చింతిల్లుటేల యిట్లు?

# శ్రుతి

ఓ హిమాచలవర, మహోత్సాహ జనక,
నీ సుపర్వకిరీట మణిప్రభలకు
పొంగి గానమొనర్చు విహంగపతుల
నిత్యగీతిక లేమి ధ్వనించునోయి?

నీ శిఖర తేజమే ధరణీతలమున
నీ పదప్రాంత సంచారులై పవిత్ర
హృదయతంత్రుల స్వాతంత్ర్యశ్రుతులు మీటు
శాంతి సమరసైనికుల యశమ్మనియొకో?

# జవహర్ లాల్

ఏరీ సైన్యబలాతిగర్వితులు భూమీశుల్ పరారామసం
చారోన్మత్తులు నిత్యభోగరతు లైశ్వర్యాంధు లల్పాశయుల్ ?
వీరాగ్రేసర, నిన్ను గాంచుటకె యువ్విళ్లూరు నీ భూప్రజా
పారావారమునందు వారి కణుమాపమ్మైన లేదయ్యెగా !

కలకల మింట రేగు విహగస్వరపాళి నతిక్రమించి యీ
జలనిధి ముక్తకంఠమున స్వాగతగీతిక లాలపింప భూ
తల మదరన్ దిశల్ ప్రతిరుతమ్మొసగన్ జనకోటి నీమహో
జ్జ్వలవచనమ్ములన్ దలచి సల్పు జయధ్వనులే జయించెడున్.

నెలల కొలంది నీపలుకు నిప్పుకలన్ దరిలేని చీకటుల్
తొలగ సమస్తరాష్ట్రముల దోర్బలకాంతులు ప్రజ్వరిల్లెడున్,
మలయసమీర చందనసమానము దావకవహ్ని నేడు నీ
వెలుగు చలింప దింతగ స్రవించియు దివ్యరుచుల్ స్రవించెడున్.

ఆలోకింతురు ప్రీతిమై నదె అసూర్యంపశ్యలా కోమలీ
జాలం బిం దరుదెంచి నేడు నిను స్వేచ్ఛాదూత, సాత్రాజితీ
లోలాక్షిం దలపోతురో కదనకల్లోలాత్మయౌ నాస్వెయిన్
బాలాసాహసగాధ నేర్తురొ భవత్ప్రాచీన నవ్యోక్తులన్ !

పల్లెలు పట్టణమ్ములు భవన్నవమంత్రవిధుల్ జపింప వి
ద్యుల్లతవంటి నీదు నయనోజ్వల తేజము గాంచి చేరరా
నొల్లరు భీతిమై పరధనోన్నతిపై మనసున్న బానిసల్
పిల్లయిరుల్ జగన్నుతరవిప్రభ డాయగ సాహసించునే?

చండార్క ప్రభవోలె ప్రాకెడు మొగల్ సామ్రాజ్యమున్ రాష్ట్ర మొ
క్కండున్ లేక ప్రతాపసింహుడెదురై కంపింపగా జేసె, మా
ర్తాండుండెన్నడు నస్తమింప డను సామ్రాజ్యమ్ముపై రిక్తహ
స్తుండై యిట్టు లెదిర్చి నిల్చు నెవడంచున్ భూమి నిస్తబ్ధమా.

సమరదిన ప్రభాతమున శంక యెరుంగని సవ్యసాచివై
విమతపతుల్ నుతింప రణవీరత జూపిన నీవు సాగరా
గ్రమున నుపన్యసించుటకు గద్దియపై నిలువన్ ధనుర్ధరో
త్తముడును యోగిపుంగవుడు దాల్చి రొకే తనువంచు నోచెదున్

# ఈ విపంచి

ఈ విపంచి గయికొమ్ము, జవాహర్,
నీ వెనువెంట జగమ్మురు దెంచెడి...

శంకా కల్లోలము జగమ్మహో!
సంకట మారుత జవసద్ధూతము
శాత్రవఘనకృత జడతిమిరమయము
బాధా నిద్రితమిది మేల్కొను నీ
భావి ధర్మ ప్రబోధారవమున—

ఈ విపంచి...

ఆశావికృతపక్ష ప్రచారమే
పాశరూపమయి ప్రాణిబంధమయి
జన్మ ధర్మబల నిర్మూలకమగు
పరధన గౌరవ బాధకమిది నీ
పరిహాసవచన బలమెరిగి తొలగు—

ఈ విపంచి...

# జీవనశిల

ఇది నిరర్థక మిదిశూన్య మిదివిషాద
మలిన కర్కశ జీవితోపలము. దీని
కాల విషవాహినీ తరంగముల నడగి
జీర్ణమైపో నెవండు శాసించె మునుపు?

ఈ శిలాలేశమును వ్రచ్చి, యింతలింత
లేసి తునియలుగా వ్రక్కలించి తుదకు
పిండిగా క్షుద్ర జీర్ణాటవీ ప్రదేశ
గతనిదాఘ ప్రభంజనాహతికి వదలు—

అది నశించిన ఆంధ్రరాజ్యరమ దలచి
తుంగభద్రావిలోల తరంగ ఘోలి
కల నొయ్యారముగా వ్రాలి నిలువలేక
వేడి నెత్తుటి నీటిలో మాడిపోవు.

# పంప

౧

తెలుగుపొలాల పంట గురుతింపగరాని తెవుళ్లపాలుగా,
మలచిన పైడిగద్దియల మంటిపొరల్ నునుసిగ్గు దాపగా,
కలగిన కారుమబ్బులు షికారులు కొట్టెడి గబ్బిలాలుగా—
నిలిచితవే, సరోవరమ, నీ వొకదానవు నాటిసొత్తుగా?

అలల మెరుంగుటద్దపు హొయల్ గులికించిననాడు తీవెక
న్నెలు నిను గారవించిరి, కనీనికల౯ దొలుకారుమబ్బువ
న్నెల నునుసోగగా దిలకనీలిమ పూవుమొదళ్ల దిద్దుకో
దలచి, భవత్తటాంచలపదభ్రమణక్రమలాస్యలోలలై!

౨

తురకరౌడీల కత్తుల కఠారుల వేడి
తుంగభద్రాదేవి నింగి కెగయు,
పగర తేజీపిండు భయదహేషాఘోష
కోటకొమ్మల గుడ్లగూబ లెగయు,
అరుల 'ఫారా'ల విహారాల 'సారా'ల
ముసలికొండలు ముక్కు మూసికొనగ,
పాదుషామీనాలపై చేతిగడగడ
పైడి 'దర్వాజా'లు పకపక నగ

తొల్లి తెలుగుకోటలు పడ్డ దుర్దినమున
తోడికమలాకరములు ని న్వీడి చెదరి
కొండరా ళ్లేవో పైగప్పుకొన్నవోటు!
బావురుమటందు వమ్మ, పంపామతల్లి!

రమ్మనినావటే తెలుగురాయని వీటికి వైరిరాజదు
ర్గమ్ముల కీర్తికాంతను పరాజయకాంతను తోడుతోడుగా:
బొమ్మలపెండ్లిగా పగటిపూట జయోత్సుకుడైన రాజు వె
న్నెమ్ముల నంటి రేయి నహితేశ్వరు స్వాగత మిచ్చినావటే?

3

వచ్చిన తొంటియోధుల విశాంపతు లెల్లరు తుంగభద్రలో
ముచ్చటకై నిజాశ్వముల ముందుగ తా మెదురీదువారు; మా
కచ్చెరువయ్యె, నట్టికులమందు జనించియు, 'పుట్టి' గట్టి, యే
పిచ్చిపథాలనో కడచు వీరుల నైతిమటమ్మ, చూచితే?

ఇందుల కీవె సాక్షివి సఖీ, సరసీ, నిజవామలోచన
స్పందనమాత్ర సూచితవిపక్షకుల ప్రమదావికస్వరా
క్రందనకోటివౌ తెలుగురాణివి: ప్రాక్తనకీర్తినామక
స్యందన మెక్క నర్హత రవంతయు నున్నదటమ్మ మాకికన్?

మా పౌరాణిక పారిశుద్ధ్యమును పంపా, నీ తరంగద్యుతుల్
స్థాపించెన్ దొలినాళ్ల రామచరణస్పర్శప్రభావంబునన్,
రేపో మాపో నశించిపోగలుగు మా ప్రేమాభిమానాల స
ల్లాపా లియ్యవి లెక్కలోనివటె లీలామూర్తివౌ నీకిటన్?

నీ కొకమాట చెప్పవలెనే, జలజాకరమా, తపస్వినీ
లోకము పుణ్యహస్తములలో నిను లాలనచేసినట్టి ప్ర
త్యేకత మంటగల్పి ధరణీశుల నెత్తుటికండ లాజిలో
ఆకలిగొన్నయట్లు లకటా! దిగమ్రింగుట పాపకార్యమే!

౪

ఆరుబయ లిది; మాది కొండంతకోట
ఏదొ, రవ్వంత యిది బలహీనపార్శ్వ
మాయెపో! వైరివీరుల ఆయువులకు
అమృతదాన మొసంగినావటవె నీవు?

౫

నీవు పిశాచివా, ప్రణయినీమణివా ముదుసళ్ల గుంపులో
కావరమెక్కియున్న మొనగానికి వానికి రామరాయమా
క్ష్మావనిభృచ్ఛిఖామణికి? అంతయు నీదిశ నాశమైన, ని
న్నే విబుధుండు 'మూలమిదియే' యని వ్రేలిడి చూపజాలడే!

౬

అమ్మా, పంప, నిలింపసేవితతరంగా, నీకు జోహారు! దుః
ఖమ్మో, రోషబలమ్మొ నాకు దెలియంగానీదు, నీపార్శ్వభా
గమ్మునా డెటుచూచినన్ విడియపాకై పండెనా? నేటి కా
'కమ్మేరాకుల' తమ్ములో మెరుపు రక్తస్రావమా, భోగమా?

ఈ సన్యాసిమఠాలు నీగుహాలు నిట్లే యుండనీ—వీథులన్
రాసుల్ వోసిన పుష్యరాగముల బేరాలిప్పు డున్నట్టులే
యీ శైలోపలఖండఖండములు నిట్లే యుండనీ... పేదస
న్న్యాసుల్ చే నరగాసులేక యిక నానందాశ్రువుల్ రాల్తురే!

౭

జీర్ణవిజయనగర శిథిలాలయప్రాంత
శైలరాశి కటకటాలమధ్య
బందియై వడంకు పంపాసరోవరా
రామ మాతృదేవతామతల్లి !

# జనని

గౌతమీం తరంగపాణి
కవితనయ విహంగవాణి
జాతివైర సంహారిణి
జననీ, జననీ, జయ
వీరాతివీరధారిణీ, స్వాతంత్రచారిణీ.

నిగమదివ్యకావ్యమాత
నిత్యనవశుభప్రభాత
సర్వకాల సత్యదూత
జననీ, జననీ, జయ
వీరాతివీరధారిణీ, స్వాతంత్రచారిణీ.

సమస్త భువన మస్తకమణి
హస్తచలిత హాలకృపాణి
జనసంచయ జయకారిణి
జననీ, జననీ, జయ
వీరాతివీరధారిణీ, స్వాతంత్రచారిణీ.

# ఏది?

నేను నాకంఠరక్తమ్ము నీపదద్వ
యమ్ము నభిషేకమొనరింప చిమ్మివేయు
చుంటి, కైకొమ్ము గీతికాశ్రుతి యడంగ,
దానితో కాలమును బుచ్చబోను లెమ్ము—

ఊరకుందు విదేల? నానోరువిప్పి
కదనభేరి ప్రయోగించితి, కంధరమ్ము
లెన్నియో వీరులవి నీకఁబుచ్చునట్లు
చేసితిగదా నిరంతరావేశ సృష్టి—

ఏది నాధర్మ మింకమీఁదో? ఇట్టులైతే అ
సంతగీతారవమ్మున అఖిలలోక
మల్లకల్లోల మొనరించి అగ్నికుండ
మందు దూకించుటా, నేనె ముందు దూకుటా?

# జామదగ్ని

ఎక్కడ వచ్చెరా, ఋషుల
నే దిగమ్రింగెడి వక్రకాల! మే
నెక్కడ, మేఘమార్గముల
నే తల దించని ధారుణీ వరుం
డెక్కడ! నక్క వచ్చి నరు
నే చెవిపట్టి యదల్చునా ?—మదం
బెక్కిన దీ జగానికి, సృ
జించినవానికి!...ఎన్ని నాళ్లురా!

*

ఏ శనివచ్చి నన్ను సెల
యేటికి దోలెనో గాని, సుంత నే
నే శర మెత్తి యింటి కడ
నిల్చినచో నిటు తేరిచూడ భూ
మీశున కెన్ని గుండెలు!—బ
లే! శివ మెత్తిన మూడు లోకముల్
లేశము నా నఖాగ్రముల
లెక్కకు రావని నేడు చూపెదన్.

*

ఎంత సహించుకొన్న నిది
యేమి యెడంద తపించిపోవు, కొం
డంత సుతుండ నిట్లబల
నై, మునినాథు నెవండో దీక్షలో

నింతకు పొట్టబెట్టుకొని
యేగిన కండ్లుడికించి చూచుచున్
చింతిలి యూరకుండుట యి
సీ! తలవంపుగదా జగమ్మునన్.

*

చెదరని మౌన యోగమున,
చిత్తమఖండవిరాగ విభ్రమా
స్పదమయి నిల్చిపోవు పరి
పక్వదినంబున, కన్ను మూతలో
కదలని రక్తనాళమున
కైదువు తాకుడు సర్వనాశమై
బెదరని తండ్రి నన్నెటు శ
పించెనో, నాకయి యేడ్చి పోయెనో!

*

అంతకు బోవనేల, సొద
లాపిన ఆ చదలేటి చాయలన్
శాంత విలోచన ప్రభల
సైగయిటుల్ మరలించి, నన్ను, నా
వంతను, చేతగాని తన
వాని నిరర్థక బాహుసత్త్వమున్
చింతిలి చూచి చూచి యెటు
సిగ్గిలునో, యెటు నవ్విపోవునో!

*

ఏనిట గూరుచున్న ఫల
మేమి?— ప్రపంచము లేని కానలో
మానుల కింతయైన, నిక
మాటికి మాటికి రాజదర్శనం
బైనసె, వాని చూపు చన
వైనసె జీవము నిల్ప జాలు నీ
ప్రాణుల కింక ధర్మ పరి
పాలన మెక్కడ వీని ముందటన్!

*

ఈ లోకస్థలి ధర్మ బీజములు నా
టింతున్, శవాకారులై
భూలక్ష్మీధవు లీ పొలాని కెరువై
పోరా! యికేమున్న, దెం
తో లాలించిన గూడ నీపరశు వాం
దోళించెడుం జూడు! భూ
పాలాఖ్యాటవి కింక మూడినది లే
ప్రత్యేక యుద్ధస్థలిన్.

*

ఇంకొక ధర్మమున్నదది
యెంతటి కార్యము లే—రవంత నా
బింకము తీర్చుకొన్న పయి
పెద్దల అప్పులు తీర్చుకొందు; ర

క్తాంకితమైన నాపరశు
వావల బెట్టిననాడు, కార్తవీ
ర్యాంకురముల్ నశించి జగ
మాగిననాడు మరొండు చూచెదన్.

*

హంతకుడు, వానిగుండె రెండైన పిదప,
తద్రుధిర ధారతో సర్వధారుణీశ
రక్త వాహిను లీ కొండ రాళ్లు గడుగ,
తర్పణ మొసంగువాడ నా తండ్రి కపుడు.

# నేల

కాలచక్రము నిలిచి పోవదె
బాలకా, పరుగెత్తరా—
ఆలమున లంఘించి మన యీ
నేల మనకని చెప్పరా.

పాడిమొదవులు జాలి బడియెను
పాలు చేపవు చూడరా;
నీడయిది, విధి నేడు మనకీ
నేల తిరిగి జయింపగా. కాల......

కెవ్వమను కసిగందులైనా
బువ్వ యెరుగవు చూడరా;
నివ్వరులు పండించినా మన
నేల మనకే వలయురా— కాల......

ఇచట పుట్టితి మిచట పెరిగితి
మచల పతితో అవనిజముతో;
ఎచ్చటికి పోగలము, మన యీ
నెచ్చెలుల విడనాడ గలమా? కాల......

పరుల నెలవుల కాసపడమే
పరమ పురుషుని ఆశవిడమే,
నెరివిడిచి మన నేలపై బడ
నిలుతుమా నిర్జింతుమామరి! కాలచక్రము......

# పిలుపు

పరులజెండా మన బురుజుపై !
పగిలిపోదా నీకు హృదయము
ప్రాణములు తపియించిపోవా ?
పౌరుషము చచ్చెనా ?—అదిగో, పరులజెండా...

లోకమును తలదన్ను కొండల
నీకవాటపు కాపుదల యిడె
దేవునికి తలవంపు లటరా
నీవుగడిపే జన్మ ?—అదిగో...

నీవుపుట్టిన నేలకొరకే
జీవితమ్ములు ధారపోసిన
వీరపురుషుల పేరు నిలుపవె
వ్యర్థమా నీబ్రతుకు ?—అదిగో...

తమశరీరపు తలపు లెరుగరు
ధర్మమొకటే నిలుపు మందురు
మనసతులు 'రణమందు జయమో
మరణమో' అన్నారు—అదిగో...

# బలి

ఇచట స్వాతంత్ర్య బీజము లేముచల్లి
నీరువోసి కష్టింతుమంటిమి, కుమార!
నవ్వెదేల? ఫలించిన నాడు మేము
వీనిగాంచి సుఖింప జీవింపమనిరొ?

నేటిదాస్యకుజము నాటి నీరువోసి
అరిగిన దురాత్ము లిట్లె నవ్విరి, కుమార!
తమ శరీరక్షణ సుఖమ్మె తలచిరపుడు
క్రమ్ముకొను కారుమబ్బులు కానరాక.

# జయభేరి

హిమశిఖరముల వెండి జండాల్
సమరవిజయము చాటుచున్నవి
హేమదిశ కప్పురపుటారతి
యెత్తినది ప్రత్యూషసుందరి,
కదలవే స్వాతంత్ర్యరథమా !
కదన వీరుని హృదయపథమున.

రోదసి గుండెల క్రోధ రేఖలు
రథ పథమ్మున రాగ రేఖలు
చదలగట్టిన జయవిపంచిని
స్వాగతామృత రాగ మొలికెడు,
కదలవే స్వాతంత్ర్యరథమా !
కదన వీరుని హృదయపథమున.

పూచివిచ్చిన రిక్కజాజులు
ఖేచరాంగన లపహరించిరి
దాచి దండలు గ్రుచ్చి నీకై
వేచియుందురు గగన లతపై
కదలవే స్వాతంత్ర్యరథమా !
కదన వీరుని హృదయపథమున.

పులుగు పాటల పులకరించిన
వలపురాయన్ని మలయపవనుని
చలువగందపు చిలుకరింపుల
తెలుగు గొంతులు కలక దేరెను,
కదలవే స్వాతంత్ర్యరథమా!
కదన వీరుని హృదయపథమున.

అగ్గిపొంగిన రక్తనాళపు
బిగ్గబట్టిన పగ్గములతో
నిగ్గుదేలిన రాచకొడుకుల
పగ్గె నోగ పై బరువుమోయగ,
కదలవే స్వాతంత్ర్యరథమా!
కదన వీరుని హృదయపథమున.

భూమినాథుని భుజస్కంధము
సామజాగ్రణి భీమ కుంభము
పాముకుబుసపు బలము మెచ్చెను
ప్రేమబంధము బిగిసినప్పుడు
కదలవే స్వాతంత్ర్యరథమా!
కదన వీరుని హృదయపథమున.

కదలు కదలుము! కాలమిచ్చిన
గట్టి గుండెల కరుణచిందుము;
కదన వీరుల కథలువిందము,
కార్యశూరుల గలసికొందము
కదలవే స్వాతంత్ర్యరథమా!
కదన వీరుని హృదయపథమున.

# స్వర్ణయుగము

ఈ కుశాగ్రబుద్ధుల తలల్ హేమఖచిత
మకుట మణిమండితము లొనర్పకుము, దేవి!
పండువెన్నెల రేలపై దండువిడియు
ప్రావృషేణ్యాజలదపంక్తి పగిదియగునొ!

ఈ నవోత్సాహ భరితుల కెన్నడేని
ఆజ్ఞలిడునధికారమ్ము నంటగట్ట
కుము, దయావతి! కొండవాగును నుతించి
నడుపుమని దానిపై నౌక విడుతువొక్కొ?

ఈ నవానందకర్తలు సైనికులట,
ఆజ్ఞయేని మకుటమేని అలవికాని
అంతిమ స్వర్ణయుగము నిర్మింతురంట.

# మాలపల్లి

మా తెలుగు దేశమందలి మాలపల్లి
కాలపురుషుని కడుపార గన్నతల్లి
కానిచో మానవుడు చూడలేని యంత
అంధకారమునం దెట్టు లడగియుండె ?

భీషణ తమఃప్రకృతినుండి వెలికిలాగి
దీని మానవుల కొసంగువానికన్న
కాలగర్భమునుండి లోకమ్మునీడ్చి
తెచ్చి తేజమ్ములో నిల్పు దేవుడెవడు ?

# పాపము!

పూరికొంపలు మండు వేసగి
ప్రొద్దు గ్రుంకిన పులులసందడి
ఊరిబావుల నీటియెద్దడి
పోరు పడలేము.

చుట్టుపక్కల కొండగుంపులు
పట్టపగలే బందిపోటులు—
పెట్టిపోయగలేని మాకీ
బిడ్డ లేమిటికో ?

దారిబత్తెములేని పయనము
ధరకు తెచ్చిన గొంతుఉరి యిది,
దైవమా! యీ పల్లె బ్రతుకిక
తప్పదేమోయి ?

# కన్నీరు

వాన నీరైన నగునది, కానినాడు
పవలు రేయి కష్టించెడి ప్రకృతి దేవి
మేన వెలువడు ప్రస్వేదమైన నగును ;

పండికోతకు వచ్చిన వరిపొలాల
దారిబడి, చేతికొడవలి తళతళమన
జారిపడిపోవు పసివాని చంకనదిమి
ముదుక పయ్యెదకొంగున కదలియాడు
చాలిచాలని బిచ్చపు చలిదిమూట
పేదవారి సంసారపు ప్రేమమోతె
కొలదియై ప్రాణసమమయి నిలిచియుండ
కాలి కేని కడెము లేని కూలిపడుచు
పరుగిడుటచూచి హృదయమ్ము పగిలిపోయి

నిర్ఝరులు రాల్చుచున్న కన్నీరొయగును ;
వాననీరైన నగునిది.

# కూలీ నెలత

నీ శరీరాంగములలేని నిర్మలత్వ
గుణవిశేషమ్ము మనసులో కుదురుకొనియె
మోమునం దెన్నడును లేని ముద్దునగవు
హృదయకుసుమ వికాసమం దుదయమందె:
లేరు నీకెందు సాటి కూలీనెలంత!

ప్రాయము గతించినను దేహపటిమ సడల
దేమి నీలో ననంత సత్కృతుల నడుమ,
భూతకోటి నహర్నిశల్ మోసికనియు
నిత్యనవయౌవనాంగియౌ నేల పోలె?

అతుల దారిద్ర్యబంధమ్ము నందుజిక్కి
గంపెడేసి బిడ్డలతోడ, కడుపుమాడి,
పరుల పల్లెత్తు మాటయేఁ పలుకబోక
నందనులనే శ్రమింప నిర్బంధపరచు
నీవు భారతదేశ మాతృస్వరూపి
ణివి చిరంతన దాస్యబంధితవునగుట.

# శ్రమ

'ఏలా యీ గోయి తవ్వేవూ?
ఓకూలివాడా

ఎన్నిపిలిచిన పలుకకున్నావు?'
"వూరికల్లా పేరు మోసిన
వారికిది బాబూ!
ఇంటిగోడ పునాదికై యీ
గుంటతవ్వేము"

'ఏలాయీగోయి తవ్వేవూ?
ఓకూలివాడా
నీలో నీవేల నవ్వేవూ?'
"వూరికల్లా పేరు మోసిన
వారు, బాబూ, దాటిపోయిరి
ప్రేతభూమిని వారికై యిది!—
రాతిగుండెల కూలివాళ్ళము!"

'నీలో జీవించిపోయేము
ఓకూలివాడా
నీలోనె నశించిపోయేము
జీవనమునకు చావునకు నీ
చేతి కష్టమె దిక్కుగా?
నిఖిలమర్త్య స్థితిలయమ్ముల
నీవె శాసనకర్తవా?'

# అద్భుతము

తెల్లనిప్పులయెండలా? యివి
పల్లెకొంపల బ్రతుకనేర్చిన
కల్లకపటములేని జీవికి
మల్లెపువ్వుల దండలా?
కాలదేవత కట్టుబాటులు
కాలదన్నినకష్టజీవీ!
ఘర్మ సలిలవికాసమా యిది?
కలుషమంతా కడిగివేసిన
కర్మసాక్షిని కౌగిలించే
మర్మవచనవిలాసమా?
కష్టకాలపుకారుచిచ్చుల
కలకలానవ్వేటి కూలీ!
నీబ్రతుకుపనిపాటలందే,
నాబ్రతుకుమనపాటలందే
నిమిషమైనా నిదురదవులక
నెత్తురోడ్చుట నేర్పరా!

## ఎప్పటికి?

నేనుకొంతకు కొంత కూలీనెకాని
పూర్ణముగ కూలివాడనై పోవనైతి :
నాదుజీవనమిట్లు గానమున మునిగి
పాటవెల్లువ పొంగులే పట్టలేక
పరిణతినిజెందు తలపుతో సురిగిపోవు—

మరి యితడు కూలివైయె స్వధర్మమున నిలిచి
గోడకట్టుచునే గొంతు క్రోవలందు
రసము జాల్వారు గీతికారవము విసరు!

పల్లియ పదాలు పనివారు పాడువేళ
నాయెడదలేచి తలయెత్తి నాట్యమాడు.

కర్మగానము లిట్టులైక్యమగునెట్లు ?

సృష్టిముగియించి దానితో జీవగాన
పరిణతస్థితి నొందు నీశ్వరుడు సతము
వీనిలో నొక్కగానమ్మె యేను తెలిసి
గట్టుదాటుట యెన్నెన్ని పుట్టుకలకో!

# శాసనము

'మిన్నేటితరగల
చిన్నారి పాపల
పలుకులైనా వినవు,
నిలిచిముద్దాడవే –
    ఏమంతమించిపోయెను సూర్యుడా!
    ప్రేమనశించెనే నీమనసులో'

"మిన్నుమన్నేలు దొర
నన్ను శాసించె నిటు.
నాతోడ నీ పంచ
భూతాలు కూలీలు,
నావంతు పనిపాట నడవాలిరా
ప్రేమింతునను మాట పిదపనేరా"

## తోటమాలి

పాలపిందెల రసము జాలువారే వేళ
పూలనవ్వుల కోడలు పులకరించే వేళ
గాలిపాటకు మనసు కరిగిపోయే తోట
మాలి జీవనమెంత మేలైనదోయి !

తరువులన్నీ వన్నె తెరలు దించే వేళ
పండుటాకులు రాలి పలుకరించే వేళ
పాదులన్నీ నింపి పాటబాడే తోట
మాలి జీవనమెంత మేలైనదోయి !

పొగడకన్నెర్రలో ప్రొద్దుపొడిచే వేళ
జాజిబంగారులో సంజగడిచే వేళ
మల్లెవలపుల కాలమెల్లగడిపే తోట
మాలి జీవనమెంత మేలైనదోయి !

## వైరి

నేను పూదోట కీనాడు పోను, నిజము ;
త్రాచుపగవోలె సంపెగతావి యిటులు
తాను నాపయి దండెత్తబూనె నకట,
ఈహృదయరాగ మెంత హరించునో యిది!

ఏల పుట్టినదే యిట్టి పూలతావి ?
నీకొరకు పూర్ణముగ నేను నిలుపుకొన్న
అంతరంగరాగము కొంత అపహరించు
నీవులేనికొరత దీర్పనేర్తుననుచు—

అక్కటా, నీవె నాజీవితాధికారి
ణివి గదే, యేల యేతెంచి నిలుపుకొనవు ?
భవదమోఘ ప్రణయగంధ బాణమొకటె
పట్టరాని సంపెగతావి పారద్రోలు.

# ర మ్ము

రమ్మునాతోడ జవ్వనీ, రజనిగడచు
వేళ, కైదండయొసగి—పృథ్విని త్యజించి
పయన మొనరింతు నవ్యప్రభాతరుచుల
మృదుహృదయరాగగంధమ్ము మేళవించి ?

నీవు నాతోడ రాకున్న నిర్జరప్ర
పంచమునగూడ నిన్నెంచి పాడుదునట :
వెర్రివారలుగాక యీవిబుధకోటి !
నీవుగలచోటనే పాట నిలిచిపోదె ?

# గండము

నీవటులు చూచుచుండుము, నెచ్చెలీ! మ
దీయకంఠబిలమ్మున తీవ్రగాన
గర్భమున గాఢవాంఛామృగ మ్మొకండు
కన్నుల దవాగ్నివిస్ఫులింగములతో, భ
యంకర విరావకంపితా శాంతముగ, ని
లాతలి విలంఘించి ప్రళయలీలావిలోల
తాండవము సాగించి భూతప్రపంచ
మల్లకల్లోల మొనరించి అయ్యయో! ని
మేషమున నిన్ను నన్నును మ్రింగివైచు,
అపుడు నీకండ్లు చల్లగా హాయి పడును!
చూచుచుండుము నీ వట్లె సుందరీ! సరే—

# తెలిసినది

ఇందుకా నా కమృతభాండ మందకుండ
ముం దపహరించి తీవు, పూర్ణేందువదన ?
దీనికై రేబవళ్లు యత్నించి యెటులో
కడకు నిను జేరగలనను కరుణవలన ?

ఏను వృద్ధుడనై పోదు నేమొ, అమృత
మొల్లనో అప్పటికి, తద్వియోగ వహ్ని
పాపచిహ్నాలతోడనే భస్మ మగుదు
నో భవద్దర్శనానర్హతాభయమున—
ఎట్టులానో యెరుంగనే, హృదయరాజ్ఞి !

కఠినచిత్తము కాలమ్ము గడిచిపోవు,
నేడె కలిగింపరాదటే నిన్ను గలియ
వచ్చునన్న రవంత విశ్వాసమేని ?

# ఉపాయము

ఇవి సుఖస్వప్నములు నాకు సృష్టికర్త
యెంచలేనన్నిగా ప్రసాదించినాడు,
వీనిలో విహరించి జీవింపు మనియె,
ఇవి యథార్థస్థితిని లభియింప వనియె;

వీనిలో నీప్రణయ మొండు వేరుజేసి
దానినే జపియింతు నిత్యాత్వ మెరిగి
ఈతపోదీక్ష కదియె లభించునేని,
ఏమనును చెప్పు మప్పుడు సృష్టికర్త!

## భ్రమ?

నేను వీరుడనై ధారుణీవిలాస
బంధములు త్రెంచుకొని మోక్షపథముబట్టి
జీవకోటికి మార్గదర్శినగువాడ
నని యొనర్చిన శపథమేమయ్యె నిపుడు?

నేడెటులు మారిపోతినో చూడవే, భ
వత్పద సరోజపూజకై ప్రాణమేని
ఇచ్చివేయుదు ననుచు నర్థించుచుంటి,
జీవులను మోక్షమును మరచితిని, చెలియ!

ముక్తి లభియించుననిన సమ్మోదమెంతొ
నీవు లభియింతువనిన నంతే ముదమ్ము.

# నీ వరము

కట్టతెగిన ప్రవాహమ్ముగతి, సతీ, మ
దీయహృదయమ్ము చించి యేతెంచు దుఃఖ
మిటులు గీతమ్ములగు, ఫలమేమొ యెరుగ :
ఇమ్మహాసృష్టికిని ఫల మేమొ యెరుగ.

నిష్ఫలమ్మగు సృష్టిపై నిలిచియున్న
నవ్యము ననంతమైన సౌందర్యమట్లు
జీవితేశ్వరి ! నాదుఃఖ భావరేఖ
దివ్య వర్ణమొకటి నీవు దిద్దినావు.

# హృదయమార్గము

ఈ కపట విరహాశ్రు
హిమబిందువుల దడిసి
నీ వదన నీరజము
నిగనిగలు చిందునని
హృదయమార్గము మరచి పోదునా, పైదలీ,
ఏది యనంతమో తెలియదా ?

దేహలావణ్య సం
దీప్తి లో తిరుగాడి
మిరుమిట్లు గొన్న నా
కనుదోయి మరునాడు
చిరశాంతిమందిరావరణమ్ము జేరు తరి
చీకటులు గ్రమ్మి సుఖచిహ్నమెరుగదుగదా ?

బాధా కవాట మగు
సౌధాంతరంగమే
పరిచితమ్మగు వేళ
పరమహర్ష మొసంగు
విరహసందీప్తియును వదనసౌందర్యమును
హృదయబంధ బలమ్మునకు సమమ్మగునటే ?

# విహారము

నీ రమణీయమూర్తి, తరుణీ,
కనరాదని ఆశ వీడుచు
న్నారు ప్రజల్, త్వదీయసుగుణప్రభ
మామకనేత్రమేనియుఁ
తేరియు చూడరా దకట,
దృక్పథవర్తిని నీవు నా కిటుల్,
వీరికి నీచరిత్ర వినిపించుట
యెట్లిక చెప్పవే సఖీ ?

* * * *

బంగరునాణెముల్ గల
ప్రవాహము నాకొకవంక బారు ; వే
దాంగరహస్యసాధన
సుఖామృత మింకొకవంక బారు ; నీ
మంగళమందహాసరుచి
మధ్యగతిన్ బ్రవహింపజూచి ఉ
ప్పొంగి యిదే నిధాన మని
మున్ను నిదేటికి నామన మ్మిటుల్ ?

* * * *

రాల శయించి అశ్రువులు
రాల్చుచు కాలము వెళ్లబుచ్చు గో
పాలుడ, నీపాలాల నడుమఁ
వెలలేని కడానితూగుటు
య్యాల లభించు నంచు
కలనైన దలంతునె వింతవింత వే
పాలకు మూలమైన
దొరసానివి నీదయ లేకయున్నచో?

*    *    *    *

ఏనిక కానికాలము గతించె
నటం చెద సంతసించుచు
న్నాను, చెలీ, గతించిన
దినమ్ములు లెక్కకురావు లెమ్ము; నా
కీ నవడోలికావిహారణేచ్ఛయె
స్వర్గసుఖమ్ము; దీనిపై
మానవకోటి నీ మధుర
మార్గము జేరగ నూచిపోయెదన్.

# దేవలోకము

“ దేవలోక ప్రసూనమ్ము లేవి ? నేడు
తెచ్చెద నటంచు ప్రతిన వట్టితివిగాదె ? ”
అని యడిగ దేల, జీవితాద్యంతరాజ్ఞి !
ఆ ప్రతిన నాకె దేవసుమాకృతియిడె.

నీ వలంకరించిన త్రోవ దేవభూమి
దివ్యదరహాసినీ ! భవదీయచరణ
తల విభూషణమైన మర్త్యస్వరూప
కుసుమమిది, నిత్యమామోద మొసగగోరు.

# తన్మయత

నీతనువు కేతకీపల్లవాతికోమ
లమ్ము నందనసౌరభాలంకృతమ్ము,
ఇట్టినీపయి గాలి నాహృదయభూమి
పట్టపగ్గము లేని తుపాను రేపు.

ఎగురవైచి నాప్రాణమ్ము నెండుటాకు
చందమున, మానవులదృష్టి కందరాని
సత్పథమ్ముల నాడింపజాలు నేమొ
ఇచ్చవచ్చినతీరున నీతుపాను!

నీశరీర పరిమళమ్ము రాశియైన
మారుతతరంగముల మయిమరచినపుడు
దొరకినవి సత్పథమ్ములో దుష్పథమ్ము
లో లవమ్మే నెరుంగరావే, లతాంగి!

# చిత్రము

ఎందుకే నీకపోలమ్ము లెర్రవారి
కరగిపోయిన నీయుషఃకాంతిలోన ?
ఏ మనస్సీమ గల పరిణామగతులు
బయలుపరచెదు నర్మగర్భముగ నిటులు ?

ఎవరిలోపొంగు భావవాహినులువారి
వదనదర్పణముల గానవచ్చునంద్రు,
నీమొగమ్మల ప్రకటించు నామనస్సు
పట్టలేకున్న రాగప్రపంచ మిటులు ?

# ఒకటే కానుక

ఎన్నడో నీకొసంగిన దీసుగంధ
బంధుర సువర్ణచందనపాత్ర ; దీని
రిక్తమొనరించుకొమ్ములంకృతులకంటి,
పూర్ణకలశమ్ము నేల పంపుదువు, చెలియ ?

ఈ విపినజీవనమునం దికెన్నడేని
వచ్చునకొ యిట్టి పరిపూర్ణవైభవమ్ము ?
కొనవె ప్రాణప్రియా ! నేడె తనివిదీర
నాహృదయరాగరసగంధవాహసేవ.

# నా కొరకు

ఈసుగంధ ప్రసవమాల వేసికొనుము
పైదలీ! నీగళ మ్మహఃప్రభలు జిమ్ము :
దరియ దపు డస్మదీయ నేత్రద్వయమ్ము
దూరముగ నిల్చి నీకు జోహారు లిడును.

అంత, లలితమ్ముగా మందహాస మొకటి
నీ పవిత్రాననమ్మున నిలువనిమ్ము :
మందగమనము వీడి నామానసమ్ము
పొంగి ముల్లోకమున భవన్మూర్తి నిలుపు.

ప్రణయపరిపూర్ణమగు నొక్క పలుకు పలికి
ఐక్య మయిపొమ్ము నీవు నా అంతరాత్మ :
అపు డనంతజీవభ్రాంతి నధిగమించి
ప్రజ్వరిల్లు నీ ఆత్మ విరావవహ్ని.

# గంధవతి

నీకొఱకే నిలింపతటినీహృదయస్థలి పూలసెజ్జయై
రేకులువిచ్చి అవ్యయపరీమళకాంతులు దిక్కుదిక్కులన్
సోకగ చిమ్ముచున్నది, ప్రసూనసుగంధశరీర, మానవా
నీకమనస్తరంగిణులు నిన్నుగ్రహింపగలేవు నేటికిన్.

జలధరసుందరీనివహా చర్చితచందనరేఖ అర్కమం
డల తిలకమ్ముదీర్చి, గగనమ్మును పెండ్లికుమారుడాయె : మం
గళదరహాసకాంతు లిటు, గంధవతీ, ప్రసరించి వ్యర్థకాం
క్షలనిడి పంచభూతముల శాశ్వతబద్ధుల జేయుచుంటివా ?

రాణుల ఠీవికై ఉదయరాగ సువర్ణపటాంచలమ్ము నీ
పాణితలమ్మునుండి విడజారి నభఃపృథివీనిబంధిత
స్థానమునిండుగా మనుజసంతతిగప్పుచు వెంబడింప, నీ
మేనిట గోచరింపదు నిమేషము, మానవతీశిరోమణీ.

కోటియుగమ్ములన్ నరునికోరికకందని దివ్యపుష్పగం
ధాటవి నీయపూర్వ హరిదంబరవేణి సమస్తదేశ ని
త్యాటనదక్షుడౌ పవనుడైన స్పృశింపగలేక, నేల పూ
దోటలనుండి నాహృదయతూలిక దాహము తీర్ప వచ్చెదన్

సోయగ ముంగరాల్ తిరుగుచున్నగతిన్ నవమేఘమండల
చ్ఛాయలు చుట్టుకొన్నవి అజాండము: పెంపుదులేని ముంగురుల్
పాయలుగాగ నీనొసలిపై విడిపోయినవేమొ, మాయమై
పోయినచీకటుల్ మరలముంచునో యీమధురప్రభాతమున్!

అఖిలజగమ్ము నీవనుయథార్థముపల్కి జగన్నియంతృ స
మ్ముఖమున పారితోషికము పొందుటకై చను నీవిహంగముల్
సుఖమయవాంఛలన్ దగులుచున్న కళంకితబుద్ధితోడ నా
సఖులయి పాటలన్ ప్రకృతిసఖ్యతనే వరియించి నిల్చెదున్

గంధవతీ, శ్రవఃకుహర గర్భకఠోరగతిన్ ధ్వనించు నీ
సింధుతరంగఘోష మరచెన్ భువనత్రయ మార్గరాజ్య గ
ర్వాంధ నదీవతంసమిది పాడదొడంగె, రసాతలస్థ ని
ర్బంధమునుండి నీవిటు ధరాతలి కీనదినుండి వచ్చుటన్.

ఇదినాలేత యెడందపొంగె యనుకో, హేమాచలాశారస
ప్రదవీణారవ దివ్యగంగయనుకో, త్రైలోక్య సౌందర్య సం
పద మూకున్ చవిసూపవచ్చిన నిలింపప్రాభవా, నీకు ని
య్యదియే జన్మవిలాసయాత్రలకు తావయ్యెన్ మదిచ్ఛావిధిన్.

తాలిమిగోలుపోయిన లతాంతములైనవి తారకల్, విసీ
లాలకలందురాలిన అలంకృతిచే నిను గారవించి, ఆ
శాలసలైన దృక్కుల వచస్స్పృధలన్ భవదీయగంధ స
మ్మేళనశక్తిచే నఖిలమేదిని మోహవశమ్మొనర్చుచున్.

చక్కెరపల్కుతో మలయచందనవందన మందికొన్నదా
చక్కని తావితో నదులు సంద్రములేలునదృష్టపూర్వవా
రిక్కవటన్న మానవు లెరింగెదరేమొ రవంతనిన్ను! మా
వాక్కు లమేయజీవరసవాహిని నెట్లు తరించు, సుందరీ?

రాగవిహీనలో జలచరమ్ములు శుష్కగళమ్ములఁ త్వదీ
యాగమనప్రభూత హృదయార్తినొకేపరి వెల్లడించు, నా
మూగతనమ్ము రాగపరిపూర్ణమటంచు గ్రహింపలేవు, సం
యోగసుఖక్షణమ్ముల మహోత్సవరావకళంకముల్ సఖీ.

ఈయాకాంక్షలు, ఈనిరంతరమనోహింసాకృతుల్, జీవహ
త్యాయజ్ఞమ్ములు, భావిభోగఫలమోహవ్యూహముల్, సాహసో
పాయమ్ముల్ మృగతృష్ణలెల్ల త్రుటిలో వారింతు భూమీజన
చ్ఛాయఁ నిన్నతిలోకగంధయుత పుష్పప్రాభవఁ నిల్పుచుఁ.

## సహజకాంక్ష

నిన్ను పూజింతునా ప్రేమనిధివటంచు
గీతములతోడ నీకెరింగింతునా? వి
మానరూపిణివైన నీ మానసమ్ము
నాపలుకుపూజలందుకో నైనలేవు—

కాదు, నిలువుమొకింత, నాగళరుతమ్ము
నీకొరకుగాదు, భువనైకనేత్ర! భవద
నంతజవసంక్షుభిత పవనారవమ్ము
ననుకరించి యానందించు నాశగాక.

# మార్పు

చెలియ, గ్రీష్మంపుఛాయలు తొలగిపోయి,
వారిదకుమారి చల్లనివార్త దెచ్చె—
కాలపథమున కష్టసుఖాలు గలవు—
ఏమిచేయంగవలె నిర్ణయింపు మిపుడు?

హాయిగా విశ్రమింతునో ఆత్మరచిత
గీతికాబద్ధ మధురసంగీతరుచుల?
లేక, యీవారిదాంగన రాకతోడ
మొదలిడు మహావర్ష వారాసి మునిగిపోనా?

సంపదలకయి శాంతినే సంహరించి
లౌకికమహాపయోధిలో దూకి, వివిధ
భూతసంక్షోభసాధనవ్రాతమును వి
చిత్రవధ చేయుమందువా? చెప్పు మిపుడు—

# సెలవు !

ఒకతె పెంచిన హరిణశాబకమువోలె
ఎన్నినాళ్లు సహింతు నీమన్ననలను ?
నన్ను నటవీమృగమ్మని యెన్నియైన
సుదతి, వదలవె ప్రేమరజ్జువు సడల్చి—

వదలవే, యీప్రవాహమ్ము నదిమిపట్టి
ఇచ్చవచ్చినయట్లు లాడింతు నింక,
స్వేచ్ఛవలన ఆవేశమ్ము చెందినాడ
నేని, లోకత్రయమ్ము నిర్జింపగలను ;

పిడికిట గదించుకొందు నీప్రేమవాహి
నీమహాశక్తి, మానవస్వామి నగుదు—
ఇంతదైవాంశమేనొక్కయింతి కొసగి
దుర్బలమ్మగు బ్రతుకెడ ద్రోయలేను.

## కృతజ్ఞత

వేచియుండుము నెచ్చెలీ, నీచరిత్ర
నేను చినిచిన్ని గీతాలలో నిమిడ్చి
పంపెద విదేశ బాంధవప్రాంతములకు
పలుకు పెంపుడుపావురమ్ముల కొసంగి ;

ఆయపూర్వ లేఖలగాంచి యరుగుదెంచు
నేట రేపట నీబంధుకోటి వివిధ
పుణ్యలోకముల్ వెడలి నీకు పూజసలుప,—
వేచియుండుము నెచ్చెలీ, వెడలిపోకు.

# చివరకు

ఏనహోరాత్రములు నుపాసించి, విసిగి
దేవియెడల నాశాలతల్ ద్రెంపుకొంటి
రోదసీకుటీరమ్ము నశ్రువులనింపి
తన్నివాసిని యెడదనే తడుపనైతి

ఎరిగియున్న యిలాతల మ్మేవగించి
అభిలషితమౌ నభమ్ము దుర్లభమటంచు
భూనభోమధ్యగత రోదసీనివాసి
పవనదేవి నుపాసించి బ్రతుకనెంచి
కడకు కోర్కెలు గంగలో గలుపుకొంటి.

ఇపుడు నేను జీవించుట యెట్టులందు
వో? సితాసితవారిదప్లుతనభమ్ము
మోదఖేదనిర్మితమైన మేదినీత
లమ్ము నైశ్వర్యమందు సమమ్ములగుట
పవనదేవి యుర్వీతల ప్రాణికోటి
గలుగు నుచ్ఛ్వాసనిశ్వాసగతి వసించు
నను నిరంతరసత్య దృశ్యమ్మెరింగి
పరిచితమ్మైన సోదరప్రాణికోటి
నిపు డుపాసింతు నాదేవి యిల్లటంచు.

# కర్తవ్యము

ఏలపోనిత్తు, విదివృథా, యీ విశుద్ధ
హృదయ గంగోదకమ్ముల, హితుడ, యిట్టు
లే సఖీరూపరసపయోరాశియందో
ఇంకిపోయి నశించిన నేమివచ్చు ?

ఆనకట్టబిగించి తోయములుత్రిప్పి
ఎన్ని యెండిన బీళ్లు పండించవచ్చు !
ఎన్నిరతనాల సస్యమ్ము లేర్పరించి
నేల నాలుగుచెరగులు నింపవచ్చు !

# కవీంద్ర

నలుదెసలు మ్రింగికొనివచ్చె విలయకాల
జలదకాండమ్ము బ్రహ్మరాక్షసి విధాన
మానవగృహమ్ము చీకటి కోణమయ్యె
నీకరజ్యోతి వెలిగింపరా, కవీంద్ర!

పచ్చినేరేడువంటి ప్రపంచ మపుడె
భానుడస్తంగతుడుగాంగ పండిపోయి
నీలమై నేలరాలి కాన్పింపదేమొ,
నీకరజ్యోతి వెలిగింపరా, కవీంద్ర!

కలగిపోవు దిశాగర్భములు పెకల్చి
దరియవచ్చెడి మృత్యుహస్తమ్మటన్న
తలపుచే ప్రాణుల యొడళ్లు జలదరించె,
నీకరజ్యోతి వెలిగింపరా, కవీంద్ర!

# స్వచ్ఛంద గానము

పాడరా స్వచ్ఛందరీతి
బ్రతుకనే ఆనందగీతి

నిద్దురల కల గడచె, వన్నెల
ప్రొద్దు కరకర పొడిచె, కన్నుల
కద్దుకొని ధర నడచు చున్నది,
విద్దెలెరిగిన పెద్దలరయగ

పాడరా స్వచ్ఛందరీతి
బ్రతుకమందానందగీతి

మేలనే వారెందరో, ఇక
చాలనే వారెందరో, ఏ
చందమున శ్రుతికందినా ఆ
నందపడు వారుందురు గదా

పాడరా స్వచ్ఛందరీతి
బ్రతుకనంతానందగీతి

మించిపడు నీహృదయజలధి మ
థించి వడిరెట్టించి మనుజుల
మంచికై భువనాంచలము లూ
గించి ఆవేశాంచితమ్ముగ

పాడరా స్వచ్ఛందరీతి
బ్రతుకఖండానందగీతి

# ఈ కుటీరము

ఏను నిర్మించిపోయెద నీకుటీర
మార్ద్ర హృదయమ్ముగల పాంథులాశ్రయింప
ఈరసైకజీవనమైన యేటిదరిని
జనపద స్పర్శలేని ప్రశాంతభూమి.

నానితాంతగహనయాత్రలోన వివిధ
చైత్ర హేమంతములు పోరు సల్పినపుడు
రాలిపోయిన ఆకులలమ్ము లేరి
కట్టుకొన్నాడనీపర్ణకుట్టిమమ్ము.

నేను ముచ్చటపడలేను దీనిలో వ
సించి ఆచంద్ర తారార్క జీవిగాగ
ఎన్ని దేశాల తెరువరులేని యిచటి
కతిథులై వచ్చి పోవచ్చు నహరహమ్ము.

# ఆ శ య ము

*

ఎందుకిందఱాంధ్రపురంధ్రు లేగుదెంచి
క్రుమ్మరింతురు సురభిళకుసుమరాశి ?
ఈ యనంత వాహిని వీని నెవరికొఱకు
మోసికొనిపోవు తనశిరమ్మున ధరించి ?

తెలుగునేల సహర్నిశల్ కలయదిరిగి
యెల్లయెడల సుమమ్ములు చల్లిపోవు
ఈతటిని గంధమున తమజాతియెరిగి
ఆంధ్రలతికలుత్తేజిత లగునొయేమొ.

# భావియుగము

ఓ భవిష్యత్ప్రపంచ మహోదధీ! అ
గాధకాలాంబరో(గ్రాంధకార గర్భ!
జీవితనదీంద్రమిదినిన్ను జేరువేళ
వెంటరావె యీగీతికాబిందువులును?

ఈతటిని బిందువులనుండి యేర్పడినదో,
తటినియే బిందువులకెల్ల తల్లియేమొ,
ఎవ్వరెరుగుదు? రవి యంతరించువేళ
కోలుపోలేవు తమ సర్వకాలమైత్రి.

ఎవ్వరేమన్న జన్మజన్మేతరముల
నన్ను విడనాడదీ అవిచ్ఛిన్నశక్తి
జగతి విడిపోయినను నా ప్రశాంతగీతి
వదలిపోదన్న అమృత విశ్వాసబలము.

# సూచనలు

చూడవోయి నేసృష్టించు సుమవితానము!
అఖిలకౌమార హృదయమ్ము లపహరించి
ఆడుచున్న వసంతవిహాయసమున:
ఇట్టిపూ లేవి చూపు నీసృష్టిలోన?

ఎందుకో దుఃఖపడిన నాహృదయమధుప
మొక్క స్నేహసుధాబిందు వొందలేదు:
నీలతాంతకాంతాజాతి కేల యింత
నరుల కుపయోగపడని సౌందర్యరేఖ?

నీప్రకృతిలోనిపూలతో రేపుమాపు
ఎంతపూజించినా అంతులేదు నీవు:
ఇపుడు నాయీప్రసూనమ్ము లిచ్చుచుండ
కొలదికొలదిగ నీశక్తి గోచరించు.

# తల్లిపాట

నేను వ్రాసిన గీతికలోని జీవ
గంధమున మయిమరచితిగాని, తొలుత
నన్ను వ్రాసిన గీతిక యున్నదొకటి
మరచిపోతి, నెంతటి మోసమయ్యె నకట!

ఆదిలేని యా మృదుగీతికాంగణమున
శబ్ద బహిరంగ భావవాసనయపోలె
నేను పరమాణురూపుడనై నటించి
పోదునట, దాని కంతమే లేదట గద!

దేవుడే బంధితుడట తదీయగీతి
కారహస్యగర్భమున, నెక్కడి కవిత్వ
మో! విచిత్ర! మాగీతిక ఊహలందు
తనను రచియించినట్టి వానినె జయించె.

*

బాలకుఁ డెవ్వఁడో యెగుర

వైచిన గాలిపటమ్ము నేఁడహో!

నీలపయోదరంగమున

నృత్యమొనర్చు, విషాదభారలాం

గూలగతిఁ వడంగు నను

కొందురు భూజనులెల్ల, దానితో

గాలికి దూలిపోవు విహా

గమ్ము లెఱుంగు తదీయగానముఁ.

# నా పథము

ఏల కంటక దూషిత మ్మీపథమ్ము
నేను గయికొంటినో గోచరించదిపుడు,
పోవుచున్నాడ, నొకదివ్య పుష్పగంధ
మహారహ స్స్వప్నయాత్రల ననుగమింప ;

ఒకరు లేదందు రసలది ఊహాకల్పి
తప్రసూనమ్ము గగన లతాంతమనుచు,
ఒకరుకంటకమార్గమ్మునకు ముగింపు
ఈసుమస్పర్శయని ప్రోత్సహించువారు.

మృదుపదయుగమ్ము కంటకావృతముగాగ
క్రమ్ముకొను దివ్యకుసుమ సుగంధమిటులు
‘కలదుకల ’దంచు హృదయమ్ము పలవరించి
ఈవిషమకంటకపథమ్మునే వరించు.

## మ న ము

వదలదీ విచిత్రశక్తి
మది మథించి కలతపరచు
ఎదదహించు విషముప్పుట్టు
నది సహింప నలవికాదు——వదలదీ...

కన్నులకెమరగు సుఖములు
సున్నయను వివేకమొసగి
మిన్నలగు సుఖమ్ములరయు
తెన్నెరుంగదీమనమ్ము——వదలదీ...

ఎవరహో ప్రమత్తమతులు
భువనగతి వితర్కమెరుగ
రెంత పుణ్యావంతులో, సు
ఖంతు రల్పచింతతో!

పొరలిపొరలి నవరహాస్య
పరంపరలు పొంగివచ్చు
నిరంతరము మేలుకొనును
భరించుటెటులీ మనమ్ము ?——వదలదీ...

# అంధకారము

నేను యోచించి యోచించి నిర్జన ప్ర
దేశముల నర్ధరాత్రావకాశములను
ఏను జన్మించుటకు హేతువేమియనుచు
తరచి తర్కించుకొంటి వృథాప్రయాస

యోచనల కందరాని అయోమయ ప్ర
పంచమదియని నిన్ను ప్రార్థించితిని మ
దీయ జీవన హేతువేదోయి యనుచు,
మాటలాడ వాకల్పాంతమానివీవు.

దివసములు వత్సరములు గతించుచున్న
విపుడిపుడు హేతుమోహమ్ము విడుచుచుంటి,
నీవహోరాత్రములు ముందునిలిచి యిట్లు
లెటకో కొనిపోవుచుండ నాకేల హేతువు ?

# సంశయము

మృత్యువా? జీవితమ? యేది మేలటంచు
నేనొక ప్రభాతవేళ ప్రశ్నించినాడ
"నేనె ఆనందనిధి" యంచు ప్రాణమరచె
"శాంతిదాయిని నే" యంచు చావుపలికె

ఏనపుడు చావుబ్రదుకుల నెదుటనిలిపి
రెండుచేతులతో చెవుల్ పిండిపట్టి
చెప్పుడు యథార్థమనుచు శాసించినాడ
సత్య సందర్శనాశా తృషాబలమున.

ఆగ్రహించెను కాబోలు నా విచిత్ర
దేవతాద్వయమేకమై తిరిగిపోయె
ఏకరూపమ్ముగలవె గతించునవియె
తుదిబ్రదుకులన్న సందేహమెదరగిల్చి.

# ఈ గతి

నిత్యమధ్యాహ్న మోహినీనృత్య మరసి
రగులుచున్న కాంతాతారుధిరమున నేనె
అగ్నిపర్వత మనుధైర్య మావహింప
జీవితపథాన త్రిప్పుచున్నావు నన్ను.

తిరుగుచున్నది ప్రాణమ్ము కరడుగట్టి
శైలమై పంచభూతాల చలనశక్తి
నమ్ముకొన్న తనుస్యందనమ్ము నెక్కి
చేతనాచేతనావస్థితి సహించి.

ఇమ్మహాంధరగతి నిరోధింపలేక
కాంతికిరణమ్మొకటి అంధకార మొకటి
తరుముకొనివచ్చి తనువులో కరిగిపోయి
దాని కఠినతకే దోహదమ్మొనర్చు.

# భూతాహుతి

దారిలో నడ్డపడిన భూతప్రభుండు
మిన్నుమ న్నావరింపగ మేను వెంచి
ఆర్చి ననుమ్రింగ సిద్ధమైనపుడు చూచి
పెంచితిని నాశరీర మావేశగరిమ.

ఎగసి యెగసి భూమండల మ్మాసడించి
త్రిభువనప్రాభవమ్ము నతిక్రమించి
పెంచుచుంటిని తనువు రక్షించుకొనగ
భూతపతివిగ్రహము మించిపోవ దలచి

పోయి, పోయి, నేనే మహాభూత మైతి!
అంతరంగమునుండి సియరపు వింటి
'దేహభాండమ్ము భూతాహుతిగ నొసంగి
మానవుడవే యగుచు నిల్వ మంచి' దనుచు.

# శోకశక్తి

ఏలశోకింతు విది బలహీనతయని
యెన్నిమారులో పలికితి నితనితోడ,
వినడు, "శోకించుటన జగమ్మునకొకింత
శిక్షయొసగుటయని విశ్వసింతు" ననును.

లోకమిదిచూచి నవ్వునుగాక నీ వి
షాదమున దానికేమి శిక్షయగునంటి,
"ఒక్కప్రాణి యేడుపుగూడ ఉర్వియెల్ల
తన విషచ్ఛాయ విడు నిజ" మ్మను నితండు.

# ప్రశ్న లేల?

ఈతనికి మతమే లేదు జాతి లేదు
వర్ణమే లేదుగాని యీశ్వరుడు గలడు,
వినినవారెల్ల నింతగా వింతపడెద
రేల? ప్రశ్నలపై ప్రశ్నలిడుదు రేల?

"ఏది, వర్ణింపుమెవ్వడా యీశ్వరు" డని
పరిహసింప నుపక్రమింతురు, విచిత్రము!
"ఎటులు వేయుదు నిపుడు నాయీశ్వరునకు
నాకు లేనివర్ణ" మనుచు నవ్వునితడు.

## బహుమతి

విహిత ధర్మపరంపర విస్మరించి
ఎందుకో నేను సౌందర్య మెరుగగోరి
దారి చూపుమనుచు నిన్నుఁ గోరినాఁడ
భువనసౌందర్యమెల్ల నీమూర్తియఁగుట.

నీవు వినబోవు మాటాడబోవు కాని
నవ్యసౌందర్యకాంక్షినౌ నాపథమున
నల్లరాతిపై నొకశాసనము లిఖించి
తెచ్చినిల్పితి "సౌందర్యదేవత" యని!

ఏను నీయూహాలపుడు గ్రహించితిని; మ
దీయధర్మపరంపర తెరువుపట్టి
నడువసాగితి మరల; నాఅడుగుజాడ
ననుసరించి యే తెంచె సౌందర్యమొకటి
నేను కోరక యే నీవు నిర్ణయింప.

# వాంఛ

ఆనందమునకై నిరంతరమిట్లు
ఏమందరము పలవింతుముకాని
ఏ అందమో లభియించినపిదప
చాలందుమనుమాట జగమునలేదు.

తనువుకోరు సుఖమ్ములనుభవమైన
మనసుకావలెనన్న ఘనతచేకురిన
హృదయవాంఛలవెల్ల నొందవినపిదప
ఏదియో కొరంత బాధింపకపోదు.

ఈకోరికలకంతమెన్నడు కలదు ?
నాకిట్టి దుర్బలానంద మీవలదు
నాలోన మరివాంఛయే లేనియట్లు
చేయగల ఆనందమీయగల వారెవ్వ ?

# దౌర్బల్యము

ప్రతిఘటించిన శాత్రవప్రతతి యెదుట
నినుదలంచి మనశ్శక్తి నిగ్రహించి
మానవజ్ఞాన పరమార్థ మైనదాని
నమ్మి నవ్వీతి నే నాయుధమ్ము విడిచి;

తనువు బాధితమై వైరమను విసమ్ము
ప్రాకు వేళ మనశ్శక్తి ప్రబలమయ్యె,
ఆత్మపథమున చీకటు లలముకొనుచు
మరల నిర్జింపుచూతము మనసుననియె.

*

ఇంతలో నింతచేరువ కేగుదెంచి
గోలపోయెద వింతలో నెటకొ యెటకొ ?
మున్నొసంగిన సంకల్పములు హరించి
యెన్న డనుకోని గతులు కల్పింతువేల ?

నాతరముగాదు నీఖేలన మ్మికేల
యెన్నినాళ్లు వేధించునో యెరుగనైన,
దానికే యింత యత్నింతు నేను—జగము
ఈమహాయత్నమందే నశించునేమి ?